

శ్రీ గాయత్ర్యైనమః

# శ్రీ గాయత్రీ స్తవాష్టోత్తర శతకము

## పూసపాటి రంగనాయకామాత్యకవి

ప్రణీతము

యడవల్లి కాపురస్థులు

బ్రహ్మశ్రీ యనమండ్ర వెంకటసుబ్బయ్యశాస్త్రిగారి

ద్రవ్యసహాయముచే

ప్రత్తిపాటి సూర్యనారాయణగారి స్వకీయ

లక్ష్మీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడియె.

నరసరావుపేట.

ప్రథమముద్రణము ౫౦౦ ప్రతులు

వైవస్వతమన్వంతరము ౨౮ వ కలియుగము

గతాబ్దములు ౫౦౩౭ ధాతృసంవత్సరము

 వెల ౦-౪-౦




శ్రీ గాయత్ర్యై నమః

# శ్రీ గాయత్రీస్తవాష్టోత్తరశతకము



శా॥ శ్రీగీర్వాణి శుభాంగి భక్తవరదా! ముక్తిప్రదా బాలికా!
నాగావాస! శివాదిపూజితపదా! నారాయణీ! శాంభవీ!
నాగర్వప్రద! శాశ్వతా విమలగాం । ధర్వప్రియా మోహినీ
౧ ఆగాత్యాంధ తమఃప్రచండకరి గా । యత్రీ దయాంభోనిధీ॥ ౧

శా॥ అజ్ఞుండన్ శిశువున్ జడుండభవదీ । యంబైన స్తోత్రంబు ముక్
ప్రాజ్ఞుల్సేసినరీతిఁ జేయుటకునే । రన్ భక్తి ముఖ్యంబ కా
దా! జ్ఞానమ్మనకంటె నొంటనిపుడే । నర్పించు స్తోత్రంబునో
యజ్ఞానాంధతమిస్రసహారకొను గా । యత్రీ దయాంభోనిధీ ॥ ౨

మ॥ ఫలమో పుష్పమొ పత్రమో జలమునో। భక్తిన్ సమర్పించుచోఁ
దలిమిష్టాష్టాన్నముగాగ్రహింతువని, భ । క్తవ్రాత మెందేనియున్
బలుకాడన్ విని పద్యమాలికను స । మ్యగ్భక్తి నర్పింతునో
అలినీలాలక నేఁడు గైకొనుము గా। యత్రీ దయాంభోనిధీ ॥ 3

మ॥ తలి నీవన్ననొ శక్తిరూపిణివి వ్య । ర్థంబౌను నీపూజకు
త్పలచాంపేయములాయజాదులును క్షు । ద్రంబుల్ కదా కావునన్
బలినీకిచ్చెద భక్తిపూర్వకముగన్। శార్దూల మత్తేభముల్
అలతిన్ జేయక వేడ్కఁ గైకొనుము గా। యత్రీ దయాంభోనిధీ॥ ౪

శా॥ దత్తాత్రేయవరప్రదా! గుణనిధీ। దౌర్భాగ్య విధ్వంసినీ
మత్తేభంబులుగాని వ్యాఘ్రములనే। మాకిచ్చుచోఁ జాలదే

---

౧ ఆగాత్యము—మూఢత్వము

సత్త్రిక్ బట్టి యొసంగరాదె యనుచున్ । సంధ్యాతలం తే మొ సూ
అత్త్రిక్ సూర్యులుగర్త్రితేఁ జన్ములు గా । యత్రీ దయాంభోనిధీ ॥ ౫

మ॥ మునుపా గాధిజుపై వసిష్ఠ ఋషిపై । భూపాలుఁడౌ రాముపై
ఘనుఁడౌ భార్గవరాముపై నుశనుపై । గాంగేయుపై వ్యాసుపై
జననీ నీదగు నేకటాక్షమును బ్రి । స్థాపించితో దానినే
యనుపంగాఁదగు నేఁడు నాపయికి గా । యత్రీ దయాంభోనిధీ ॥ ౬

శా॥ గీర్వాణుల్ ఋషిచంద్రులున్ । మునునినున్ గీర్తించినారెంతయున్
గీర్వాణంబున మాతృభాషయగుటన్ । వేఁడ్కంమనాంధ్రమ్ముసన్
సర్వజ్ఞామెదియైన నివొకటిగన్ । భాషంతునా బాసనే
నర్చాచనము చేయఁజాలఁగద గా । యత్రీ దయాంభోనిధీ ॥ ౭

మ॥ నిను ధ్యానించిన నొక్కమారె దద్విజుల్ । నిష్పాపులై వెంటనే
కనదుత్తుంగ సుధర్మహర్మ్యముల సౌ । ఖ్యంబుంది యీ లోకమం
దున నాలోకమునన్ సుఖింతురనః । సంతోషించి నీన్ జేరనా
ననఘున్ జేయవె నిన్ను వేఁడునను గా । యత్రీ దయాంభోనిధీ ॥ ౮

శా॥ సిద్ధ్యానంబుననుండు పామరుని శే । విన్ జేరఁ గాఁదీసివే
స్వాధ్యాయంబుననుంచి కష్టపుఁబరీ । క్షల్ సేసి, యాపిమ్మటన్
అధ్యాత్మంబుఁ బ్రిబోధచేయుటకునై । హార్షాచిత్త దిత్తా బ్జవె
అధ్యాపించెను నన్నుఁగొల్చెదను గా । యత్రీ దయాంభోనిధీ ॥ ౯

మ॥ అలనీరేజ భవాదిదేవతలు ది । వ్యాబ్దంబు లెన్నేని ని
శ్చలయోగంబుననుండియున్ నినుఁగనన్ । జాలంగ లేరన్నఁ జం
చలచిత్తుండను భూమిదేవుఁటగుటన్ । గాంక్షించితిన్ నేఁడు నా
కల వెట్లయ్యెదవో యెఱుంగఁగద గా । యత్రీదయాంభోనిధీ ॥ ౧౦

శా॥ అంభోజాసనుఁ డాదిమూర్తులు నినున్ । బ్రార్థించినారంచు నే
సంభావించితిఁజుమ్మి నెమ్మనములో । సౌమ్యాత్కృపాదృష్టి సం
రంభంబుల్ దొలఁగించి కావఁగనగున్ । బ్రహ్మాదులన్ బోలె న
న్నంభోరాశిగంభీర, పంచముఖి గా । యత్రీ దయాంభోనిధీ ॥ ౧౧

మ॥ శతకంబాళ్కటిఁ గాడినంతటనె నీ । స్వాధీనమేనౌదు నే
యతులం బెన తపంబుఁ జేయుమనినీ । వందేమొ యీవేళ జీ

వితమున్నన్ శతవర్షముల్ రుజలునా । విస్తారముల్ గానమే
వ్యతిరేకంబు ఘటిల్లునో యెఱుఁగ గా। యత్రీ దయాంభోనిధీ ౧౨

శా॥ దారిద్ర్యాంధత మిస్రహారివని ప్ర । స్తావింతు రీవని గాని యె
వ్వారిన్ బ్రోచితొ యెన్నఁడో తెలియన।వ్వారన్న ప్రాచీనమౌ
దారిద్ర్యాంబుధి ముగ్నులన్ బెనుప స । త్యంబద్దియాఁ బాపసం
హారా! భక్తజనాభిలాషితద గా । యత్రీ దయాంభోనిధీ ॥ ౧౩

మ॥ మును భక్తాళిని గాచినావనుచునిన్ । బూర్వుల్గడుం బాడిరా
ఘనమౌ పాట పురాణగాథయయగున్ । గాఁబట్టి యీవేళ దా
నిని సత్యమ్మని చెప్పుకొంటకియి నే । నిన్వేఁడుచున్నట్టి న
న్ననఘున్ జేయవె, యవ్యయా సురభి గా। యత్రీదయాంభోనిధీ॥ ౧౪

శా॥ ఆపద్బాంధవ వీవటంచు మదిలో । నశ్రాంతమున్నమ్మి నే
నీపాదాబ్జయుగంబుఁ గొల్చితిఁ జుమీ । నిక్కంబుగా నీవహో
యాపద్బాంధవవైనచో నికను నా । యందున్ దయన్ జూపినా
యాపత్తుల్వడిఁ దీర్చిపోవఁదగు గా । యత్రీ దయాంభోనిధీ॥ ౧౫

మ॥ ఇడుముల్ పెక్కులు పొందుచుంటిమ నితాం । తేదేవికిన్ భక్తుఁడం
చడుగన్ నీదగుపేరు సెప్పవపుడే । హాస్యంబునవ్వారు నీ
సెడుచో నాయపకీర్తి నీదియగుటన్ । జిత్తంబులో నెంచి నీ
యడుగుల్గొల్చెడు నన్నుఁ గావఁదగు గా।యత్రీదయాంభోనిధీ। ౧౬

శా॥ పుట్టంబోయెడు బాలురక్షణముకై । పూబోండ్లకున్ ము[illegible]గాఁ
బుట్టింతీవు స్తనంబులన్ వెదకఁగాఁ । బోకుండఁగాఁ బాలకున్
గట్టాపుట్టి సమస్తకష్టములకున్ । బాలైననాకేమిటన్
అట్టేయుంచితివాకొ తెల్పఁగదె గా। యత్రీ దయాంభోనిధీ। ౧౭

మ॥ ఒకనిన్ సాఁకితిమున్నటంచునను ని । ప్పూర్వోక్తన్నచోఁ దల్లి సాఁ
కక యేలాగున సర్వరక్షిణి సమ । జ్ఞన్నీవు వైకొందువో
ఒకరోగిం దగునట్లు కావనటకిం । కొక్కండు నాసిల్లి హా
నకటా పొమ్మన వెజ్జవాఁడగునె గా । యత్రీ దయాంభోనిధీ॥ ౧౮

శా॥ తప్పుల్ పెక్కులొనర్చినాననుచు హృత్కంజంబు నెంతేమొఁనూ
ర్తప్పుల్సేసిన గాసుతప్పు లెపుడున్ । దండమ్మతో మాయవే

తప్పుల్బిడ్డలొనర్పఁ దల్లులకడన్ । దర్కింప నొప్పౌగదా
అప్పా తల్లివిబిడ్డఁగావఁగదె గా । యత్రీ దయాంభోనిధీ ॥ ౧౯

మ॥ మము నీరీతిగఁ గోరఁగావలయునే । మాభక్తునిన్ మేమెఱుం
గమె రక్షింపమెయంచు నాడెదవొకో । మందేహ సంహారిణీ
అమయేనడ్గక పెట్టదన్న నుడి స । త్యంబేకదా యందుచే
నమరానోకహ వేఁడినానిటులు గా । యత్రీ దయాంభోనిధీ॥ ౨౦

శా॥ కల్పక్ష్మాజము నెవ్వరేమడిగినన్ । గాదంటయేవేమి నా
కల్పాంతమ్ములదాఁకఁ గీర్తివడయన్ । గాదేజగాలంకృతీఁ
డల్పుండంచును వీడనే యొకనినే । నాళాగునన్నిప్డు నీ
యాల్పుంగావఁగఁ జెల్లదే యిపుడు గా । యత్రీదయాంభోనిధీ॥ ౨౧

మ॥ మును పెక్కండ్రను గావలేదె యహహా । ముల్లోకముల్మెచ్చఁగా
నినురక్షింపనినాక కీర్తియొకొ కా । నిమ్మందువా యొక్క య
ర్థిని రక్షింపకయున్నదాతయొకొ ప్రే । ధ్వన్ బెక్కురన్ సాఁకినన్
అనఘాయాతఁడ దాతకాకరయ గా । యత్రీ దయాంభోనిధీ॥ ౨౨

శా॥ హృత్తాపంబుహరించు దేశికుఁడె యు । ర్విన్ వేడుగా శిష్యుడా
విత్తంబున్ హరియించి మేడలను ని । ర్మింపంగ నాత్మార్థమై
సత్త్రీయందఱుఁ బెద్ద యొజ్జలగుటన్ । సత్యంబునా చిత్త మా
యత్తంబిప్పుడుచేసితిన్ దమకు గా । యత్రీ దయాంభోనిధీ॥ ౨౩

మ॥ కలిలోనైజపుజిత్తమున్ బొలము ప । క్వంబైనదో లేదొకో
తెలియన్జాలకమందుపై గురులు ధా । త్రిన్ ఛాత్రులన్ గూర్చి వా
రలకేమేమొ ప్రబోధచేసెదరు నే । రన్ వారల న్నమ్మనా
కలహంబోఁడిరొకమ్మదేశికవ గా । యత్రీ దయాంభోనిధీ॥ ౨౪

శా॥ ఆకర్షింతురు వ్యాజదేశికులు తా । రాశాత్ములైయుండియున్
గాకున్నట్లు నటించుచున్ సిసుల ధా । న్యంబుల్ ధనక్షేత్రముల్
మీకేలా! యవిదుఃఖదమ్ములనుచున్ । మేధ్యాత్మలీవట్టుగా
నాకర్షింతువు దుర్గుణంబులను గా । యత్రీ దయాంభోనిధీ॥ ౨౫

మ॥ ఉపదేశంబులు సేయుచుందురిల । శిష్యుండైనమాత్రాన జి
త్తపరీపాకమెఱుంగకుండనె సుమం । త్రంబుల్ మహావాక్యముల్

విపరీతంబు ధనాశచే గురులు బ । ల్లేయట్లుగాకుండ నా
కపవర్గేశ్వరి నీవు దేశికవు గా । యత్రీ దయాంభోనిధీ ॥ ౨౬

మ॥ ధనముం గోరక మాన్యముల్ గొనక త । త్త్వంబుం బరీక్షించి శి
ష్యుని కేవేళకు నేమిచెప్పవలెనో । యోచించి సత్తోత్రముం
గని బీజంబును బాత్రతం దెలిసి దా । నంబన్న న్యాయంబుగా
ననుకూలంబగు మంత్రమిచ్చెదవు గా । యత్రీ దయాంభోనిధీ ౨౭

శా॥ నిన్నే నమ్మెడునట్టివారరయగా । నీదాసులౌదా వెన
ర్నిన్నే వేడెడువారు వార్ధులను నే । నిక్కంబ బంధించెద
ర్నిన్నే కొల్చెడునట్టివారు దధులన్ । నీరంతయున్ ద్రావువా
రన్నా నీదు మహాత్మ్యమెంతటిదో గా । యత్రీ దయాంభోనిధీ ॥ ౨౮

మ॥ జనని కర్జము నేమిసేయుమని యా । జ్ఞాపింతువో నాకు దా
నినిమాత్రంబె యొనర్చుచుంటి నిజమీ । నీయాన నావంత దా
టను దక్షత్వము లేని నాకయిని గా । ఘంబైన కోపంబుని
కను లేపూనంగ బిల్వనోయననీవు గా । యత్రీ దయాంభోనిధీ ॥ ౨౯

శా॥ మొక్కంగా వరమీయలేని తమకున్ । మొక్కుల్ సమర్పించు చో
దికా రేటికి నింక మొక్కదనుచున్ । ధీగాళి నింపెంత్రు నన్
మొక్కుల్వెక్కులొనర్చు నాపయిని నీ । కొక్కన్ననుం జూపి యో
యక్కా కోరికలెల్ల దీర్పంగదె గా । యత్రీ దయాంభోనిధీ ॥ ౩౦

మ॥ సుదతీ నీకృప దొంగవంటిదనుచున్ । ౧ సూత్తానులే పల్కం నా
పదకాలంబునం జెప్పకుండం జనున్ । భావంబుతో నుంటి నా
పెదదొంగన్ వెనంబంపు సేవకుడు నీ । బిడ్డండు నీశిష్యుడ
ల్లదె కష్టంబుల బ్రుంగిపోయెడిని గా । యత్రీ దయాంభోనిధీ ॥ ౩౧

శా॥ నిన్నే తల్లిని దండ్రిని గురుడవున్ । నిక్కంపు దేవుండవున్
మన్నీండంచు ననారతంబును మదిన్ । గాంక్షించు భక్తాళికిన్
బిన్నంబుల్సను దెంచునన్న జననీ । చిత్తూడు ద్రొక్కంగబో
నన్నా కోవెలమీదబడ్డట్టులు గా । యత్రీ దయాంభోనిధీ ॥ ౩౨

మ॥ సుదతీ నీమనువున్ జపించుట వసి । ష్ఠుండాదె భాస్వంతుతో
దిద్రశాచార్యుండొసంగె నగ్నికిని శ । క్తిన్నీటిలో నాటన

---

౧ సూత్తానులు = నేర్పరులు

ట్లు దనుఁగన్ బ్రదికించెను క్రుంగుడుగ చున్ । ౧ లుక్కేమి రాకుండ నె
య్యది చేయంగను లేరు నింగొలిచి గా । యత్రీ దయాంభోనిధీ॥ ౩౩

శా॥ సూర్యుం గాంచిన జేఁకువాలు మొగమున్ । జూపించకున్నట్లు ధీ
వర్యా నిన్ను జపింపనిక్కటులు వో । వన్ బోక స ధ్యాసతీ
ధైర్యంబంతె నశింపఁజేసెడిని వి । స్తారంబులై నాకు నో
యార్యా హేతు వెలుంగఁజేయఁగదె గా । యత్రీ దయాంభోనిధీ॥ ౩౪

మ॥ అయుదా యీశ్వరి కన్నతల్లికననే । యాటాడుచున్నా స్తనం
ధయుఁ బల్గాకియువచ్చి పేర్మి విషమున్ । ద్రావింపఁగఁ బ్లాగఁ జూ
చియు వారింపని తల్లియట్లగునఁగదా । చింతిపఁ గష్టాలనీ
కయి పార్థించెడు వారిఁ జేకటన గా । యత్రీ దయాంభోనిధీ॥ ౩౫

శా॥ కాలంబింకను రానె లేసు నిలుపుమా । కాలానుసారంబుగాఁ
జాలానికు సుఖంబు లీతుననుచున్ । సర్వజ్ఞయందేమొ న
ష్కాలంబుదును బుట్టభూసురులు వి । స్తారంబు పఁడింత్రి నీ
యాలాపానసురత్వమేగనవ గా । యత్రీ దయాంభోనిధీ॥ ౩౬

మ॥ ఋతుధర్మంబునఁ బణ్ణముల్ ఫలములున్ । వృక్షమ్ములీఁజూడు నీ
గతినింబట్టి ఫలంబులట్టలని వ । ల్కంజూచెదో యేమొ నా
గతికై నీవును వేచుచోఁగను సత్కల్యాణి యజ్ఞేశి నీ
యతులంబైన మహత్మ్యమేమిటిది గా । యత్రీ దయాంభోనిధీ॥ ౩౭

శా॥ లోహవ్రాతమునుంగరంగెడిసి రా । లుంగూడ నీర మ్యోడిన్
ఆహా వజ్రముకూడ వజ్రమున భి । న్నంబౌను మోచింపగా
నీ హృత్సారసమేమి వస్తువులచే । నిర్మింపఁగాఁ బడ్డదో
ఆహారపద్రద మెవ్విధిన్ గరఁగు గా । యత్రీ దయాంభోనిధీ॥ ౩౮

మ॥ జనని నీహృదయంబహో మొదట వ । జ్రంబైనను బిమ్మటన్
వనమై తోఁచుటకున్ బహుల్ క్రమముగాఁ । బాధస్సునై తేనెమై
ననమై పండయు కొమ్మయై క్షితిజమున్ । గ్రావంబును లోహమై
అనపాయంబగు వజ్రమయ్యెఁగద గా । యత్రీ దయాంభోనిధీ॥ ౩౯

శా॥ నీమంత్రంబు హరించు పాపములనే । సిన్ జేయులే డెవ్వఁడీ
భూమీయందున నంచుఁబల్కు దురహో । పూతాత్ములా వాకుసూ

---

౧ లుక్కు = లోపము

నీమంత్రానక శక్యమా దురితముల్ । నే జేసియే యున్నచో
నా మాహాత్మ్యము నిర్మూలించునది గా । యత్రీ దయాంభోనిధీ ॥ ౪౦

మ॥ జయమే నీదగు భక్తపాళికెటనే । సంతోషమే కాం బరా
జయమెన్నండును గల్గబోవదనుచున్ । జాటింపవింటిన్ బరా
జయమే తెంచెడునట్లు దోచెడుం జుమీ సర్వజ్ఞ నాకిత్తరిన్
అయదా యెవ్విధినన్ను గాచెదవొ గా । యత్రీ దయాంభోనిధీ ॥ ౪౧

శా॥ శ్రీ రాజిల్లకయుండు మానవుండు సన్ । చిత్తంబులో నెంచి తాం
గోరన్ జేకురుచుండు లచ్చియపు । డే కోర్కెల్లను స్తంబునీ
కారుణ్యామృత వీక్షణంబు గను గా । తన్మెయ్యెల్ల వర్తించు ని
న్నారాధింపనివాడె మందుడగు గా । యత్రీ దయాంభోనిధీ ॥ ౪౨

మ॥ అరయన్ బెక్కులు సంశయంబులెడలో నక్రాంతమున్ దోచెడిన్
గురువుల్ వానిం దీర్చికొంటకయి నా । కున్ లేరు మానీవయో
గురురూపంబున నాకు ౧ ద్వాపరములన్ గూల్పంగ రాకున్నచో
నరవిందానన నాకు నేదిగతి గా । యత్రీ దయాంభోనిధీ ॥ ౪౩

శా॥ నీమాకంబును జాటుచుండునుగదా । నిక్కంబుగా నెప్పుడున్
నీరేజాప్తుడు రాత్రివల్లభుడుడుల్ । నీకంటె వేరెవ్వరు
న్నారే యజ్ఞులు నిన్ను గానక మహా । సందాప్తి కెందెందునో
యూరాటంబున దిర్గుచుండెదరు గా । యత్రీ దయాంభోనిధీ ॥ ౪౪

మ॥ చతురాస్యుండవు నీవయుంచనిన శ్రీ । గ్లంబాతడౌ నీకు న
చ్యుతుడీవన్న నతండు నీహృదయమా । నుగ్రుండునుం జుట్టగున్
క్షితియారీతిగ యోనియానా * కృశానున్ నీ మోముగా నయ్యెడిన్
అతివా వీరలు నీవుగావుగద గా । యత్రీ దయాంభోనిధీ ॥ ౪౫

శా॥ ఆదిన్ ముప్పురు మూర్తులెన్నగ ద్వదీయంబైన యంశంబులే
కాదా వారల సేవచేయనలెనా । కాంక్షించి నిన్నెప్పుడున్
శ్రీదాయీ! దనుజాంతకా! నిరయహా । చిత్తంబులో నెంచుచో
నాదివ్యంబు పదంబు చేకురదె గా । యత్రీ దయాంభోనిధీ ॥ ౪౬

మ॥ జననీ యొక్కటి విన్నవింతు వినునీ । సాన్నిధ్యముందుండి నా
మనసో చంచలమౌట నీభజనమున్ । మాటన్ వినంగా నె యొ

---

౧ ద్వాపరము = సందేహము, * కృశాను = అగ్ని

దుఃఖో పోయెడు నేమిమోవినెడు సం । దుఃఖ జూచెడిగాన న
న్ననఘుఁ జేయఁగ నీదెభారముచు గా । యత్రీ దయాంభోనిధీ ॥ ౪౭

శా॥ అబ్ధిన్ గ్రుంకిన ముగ్గినను వి । ష్ణ్వారాధనం జేని యా
రబ్ధంబైనను గాశికాదిపురముల్ । రక్తిన్ విలక్షింపఁ బ్రా
రబ్ధంబుల్విడనాడు నేనరుని నీ । వ్రాపందలేకున్నఁ బా
పాబ్ధా ఘోర్గ విభంజనాజనని గా । యత్రీ దయాంభోనిధీ ॥ ౪౮

మ॥ జననీ విన్నపమాలకింపఁదగునా । స్వాంతంబ దెల్లప్పుడున్
ఘనుడా సారథిలేని గుఱ్ఱమువలెన్ । బల్పోకలన్ బోవు నె
వ్వని నే లక్ష్యము సేయఁబోదగుట నీ । బాలున్ విచారించి నీ
వనఘా సారథివై మరల్పదగు గా । యత్రీ దయాంభోనిధీ ॥ ౪౯

శా॥ లక్ష్మీవంతుఁడు కాఁదలంచునగుఁడే । లక్ష్యంబుతో నెమ్మదిన్
సూక్ష్మంబైన త్వదీయపూత మనువు సం । స్తోత్రంబు గావింపనా
లక్ష్మీ చంచలమైనవానికడ నె । ల్లప్పున్ వసించున్ గదా
హా త్వన్నీకు నసాధ్యమేయొకటి గా । యత్రీ దయాంభోనిధీ ॥ ౫౦

మ॥ పుస్తకన్ శంఖము చక్రమంకుశకశాం । భోజాతముల్ చేతులం
దునమాత్రంబు ధరించుననన్ గొలువ సం । మోదంబు నీకబ్బునే
యనదేమో యవినష్టకర్మలను సంహారంబు గావించెడిన్
అనుకూలంబుగ నాకుమమ్మవియ గా । యత్రీ దయాంభోనిధీ ॥ ౫౧

శా॥ నీమంత్రంబు మహాత్మ్యమిట్టిదనుచున్ । జెప్పన్ శక్యుండెవ్వఁడో
యేమంత్రంబుఁ బఠింపఁబూనినసరే । యేవిప్రుఁడే కానియున్
నీమంత్రంబు జపింపకుండ మొదటన్ । ధిక్కారమున్ జేయ లే
డామంత్రంబుఁ ద్యజింతునేయొకను గా । యత్రీ దయాంభోనిధీ ॥ ౫౨

మ॥ మనువుల్ కోట్లకొలందియుండిన మహా । మాయా త్వదీయంబు స
న్మనువున్ దొల్త జపింపకున్నపుడు శూ । న్యంబౌను సత్యంబు పా
వనతంచున్ బలుకాడుచుండెదరు వి । ద్వాంసుల్ కదా కానయా
యనఘుం బ్రామనువున్ దృజింతునొకొ గా । యత్రీ దయాంభోనిధీ ॥ ౫౩

శా॥ నీమంత్రంపుబలంబె పో బలమగున్ । నిక్కంబుగా వేనవే
ల్గామాతా కలయుట్టి మంత్రములకున్ గాఁబట్టి యెల్లప్పుడున్

నీమంత్రంబు జపించు బ్రాహ్మణునకున్ ౧ ధిష్ణ్యంబు వర్ధిల్లఁగా
నామంత్రింబుఁద్యజించువాఁడఘుఁడు గా। యత్రీదయాంభోనిధీ॥ ౫౪

మ॥ సంధ్యావందనమాచరించి పిదపన్ । శైవాది మంత్రమ్ములన్
వింధ్యాద్రీశ్వరి కోట్లుగాఁ దలఁచినన్ । ధిష్ణ్యంబు నీదాట ని
ర్మాంద్యంబొందుచు జపించుచో నిను నటుల్మాహాత్మ్యమెంతబ్బునో
అంధ్యంబందు మునింగినేఁ దెలియ గా। యత్రీదయాంభోనిధీ॥ ౫౫

శా॥ లభ్యంబయ్యెఁ ద్వదీయమంత్రమిఁక నేలా వీడుదున్ ధాత్రి వాక్
లభ్యంబౌనది యేదిలేదుకద ! సా । లభ్యంబు నీమంత్రమే
సభ్యత్వమ్మున నుండఁజేయునిఁక నే । స్వామిన్ దలంపన్ జుమీ
అభ్యర్థించెదు నన్నుఁబ్రోవగదె గా । యత్రీ దయాంభోనిధీ॥ ౫౬

మ॥ అరయన్ సేవ్యము చేసినన్ మఱియు నే । వ్యాపారమున్ జేయదు
ర్భరమా సన్నులువచ్చి మీదఁబడు భూ । పాలాజ్ఞచే వెంట నీ
వరమంత్రంబు జపంబు సేవ్యమున నే । పన్నుండఁబోదందుచే
నరవిందాన జపింతు నీమనువు గా । యత్రీ దయాంభోనిధీ॥ ౫౭

శా॥ శబ్దార్థంబులు పెక్కురీతుల నిరున్ । జాటున్గదా వానినే
యబ్దంబుల్ యుగముల్ననున్ దెలియఁగా। నాయుస్సునూఱేండ్లయా
శబ్దార్థంబులతోడ నేమియని నా । స్వాంతంబు నిన్ జేరెఁ బా
పాబ్ధవ్రాత విభంజనాకొనుము గా । యత్రీ దయాంభోనిధీ॥ ౫౮

మ॥ ధనమార్జించుట పౌరుషంబయనుచున్ । దౌర్భాగ్యమాబుద్ధి నా
ధనమార్జింపఁగ రి త్తచేసితిఁజుమీ । తథ్యంబుగాఁ గాలమున్
వినియోగించెద నింక నా సమయమున్ । నీమంత్రమున్ శౌడఁగా
ననఘా యిప్పుడు నన్నుఁగావఁగదె గా। యత్రీదయాంభోనిధీ॥ ౫౯

మ॥ తలినీ మంత్రముచేత నేరద ద్విజ । త్వమ్మున్ ద్విజుల్గాంచి వి
ద్యలనార్జించి విభూతులన్గొని ఋషి । త్వమ్మున్ సమార్జించి శ
త్రుల దర్పల్గొసి యెందు నిర్భయముతోఁ । దున్మాదుచున్నారు నీ
యలఘుప్రజ్ఞనుతింప నాతరమె గా । యత్రీ దయాంభోనిధీ॥ ౬౦

మ॥ ధనమున్నప్పుడ యన్నదమ్ములతగా । దాలుందు మాన్యంబులు
న్ననొ గల్లంమునఁ బంటలన్ భయమగున్। భద్రాత్మకాయెప్పు డె

౧ ధిష్ణ్యము = బలము

వ్వని పేచీయొసఁగూడఁ బట్టిదగు భ । వ్యంబైన నీ మంత్రమే
ననయంబున్ జపియింతుఁ జిక్కనది గా । యత్రీదయాంభోనిధీ ॥ ౬౧

శా॥ భక్తిన్నిన్ను భజించుమానవుల పా । పంబుల్వెసన్ బాపి యా
సక్తిన్ మోక్షమొసంగుదానవను నా । సంకీర్తనవ్వింటి న
వ్యక్తుండన్ భజియింపనేరను భవ । త్పాదాబ్జముల్పట్టితిన్
ద్యక్తున్ జేయక యెట్లుకాతువనను గా । యత్రీ దయాంభోనిధీ ॥ ౬౨

శా॥ ఆర్తత్రాణపరాయణా! శశిముఖీ । హంసాధిరూఢాసతీ,
వర్తిల్లన్ భవదాజ్ఞయందు జడుఁడే । బిన్నంబులన్ వాయునిన్
గీర్తింతున్ నిరతిన్ మదీయ వినుతుల్ । కేడింపకల్పాంతసం
చార్తిన్ జెందిన నన్నుఁ బ్రోవఁగదె గా । యత్రీదయాంభోనిధీ ॥ ౬౩

మ॥ ధరనేమర్త్యుని నాశ్రయించిఁ దలి, దౌర్భాగ్యమేమున్న దు
ర్భరమౌ కష్టము లేగుదెంచిన తరిన్ । రక్షింతునిన్నంచు నొ
క్కరుఁడేనిన్ బలుకాడ నేరఁడుగదా । కల్యాణి నీయాశ్రయం
బరలేఁ బట్టియమర్త్యభూరుహము గా । యత్రీ దయాంభోనిధీ ॥ ౬౪

శా॥ శక్యంబయ్యెడు నె త్వదీయ మహిమల్ । స్తోత్రంబు గావింపఁగా
ర్థక్యంబేమియు లేక యన్నిఁట భవ, ద్రిమ్యంబు రూపంబె యే
వాక్యంబందునఁ గానవచ్చుఁ దెలియన్ । భ్రష్టుండ నీలోననే
నైక్యంబయ్యెడు దారిఁజూపఁగదె గా । యత్రీ దయాంభోనిధీ ॥ ౬౫

శా॥ జననీ నీదు ప్రభావమున్ దెలియఁగా । సామర్థ్యమేముండు మ
ర్త్యనరున్ దంతిని బెద్దజంతువులలో । దోమన్ దదాకారమై
తనరన్ సూక్ష్మపు జీవులౌ నిటియున్ । దద్రూప యుగ్మంబులో
ననయంబున్ వెలుఁగొందుచుండెదవు గా । యత్రీదయాంభోనిధీ ॥ ౬౬

శా॥ దుర్వారంబగు సంసృతిన్ మునిఁగి సం । తోషించుటే కాని నా
దౌర్భాగ్యంబెటులౌగునో యెఱుఁగఁ, జూ । దౌష్ట్యంబు మన్నింపవే
యూర్జ్వాటంబున నిన్ను నెమ్మనములో । నశ్రాంతము న్వేఁడు నీ
యుర్వ్యన్ బ్రోవఁగ నీదె భారమగు గా । యత్రీ దయాంభోనిధీ ॥ ౬౭

మ॥ జలమందెన్నిరకాల సత్వముల మున్ । సంసృష్టిఁ గావించితో
స్థలమందన్నిరకాల సత్వములనున్ । దయూసక్ష్మ రూపంబుగాఁ

గలుగఁ జేసితి ౧ తారుకాణముగ న । క్రింబుఁ దలీ * వల్లినీ
యలఘు బ్రతిజ్ఞనెఱుంగ నాతఁడె గా। యత్రీదయాంభోనిధీ॥ ౯౮
శా॥ రౌద్రంబై కనిపించుచుండెడు భవ । ద్రివ్యాంబు రూపంబె సౌ
భద్రంబై యొకసారితోఁ జెడుఁజుమీ । భావించిచూడంగ న
తుద్రంబైన త్వదీయరూపమెఱుఁగఁ । తుద్రుండ నేనమ్మ విం
ధ్యాద్రీవాసిని నన్నుఁ గావఁగదె గా । యత్రీ దయాంభోనిధీ॥ ౯౯
మ॥ భవదాకారము నిట్టిదంచుఁ దెలుపన్ । బ్రహ్మాండమున్ సృష్టిచే
సి వినోదంబులు పెక్కుతేర్పరచి వా । సింగంటివౌ తల్లి నీ
వివిధాకారములన్ గనన్ గనుఁగవన్ । విశ్వేశ్వరీ యిచ్చినా
వవియేలాగునఁ జూడఁజాలుదును గా । యత్రీదయాంభోనిధీ॥ ౨౦
శా॥ విశ్వంబంతయు నీమహాత్మ్యమున నే । వెల్గొందుచుండున్ సదా
విశ్వామిత్రులు మిత్రులౌదురుకదా । ప్రీతిన్ నినున్ వేఁడినన్
విశ్వాధీశ్వరి నీకసాధ్యమొకటం । దేయుండు నే చూడఁగా
నైశ్వర్యప్రద నన్నుఁగావఁగదె గా । యత్రీ దయాంభోనిధీ॥ ౨౧
మ॥ తలిసీ వెందును నైనఁ గన్బడుట చే । తన్ జూచుచున్నట్టి వా
రలు ద్వైతంబని కొందఱాడెదరు నా । బ్రహ్మణ్యులైనట్టి వా
రలో యద్వైతమటంచు నాడెదరు నిన్ । ప్రార్థింతునా రెంటిలో
నలరన్ దగ్గదియేదొ తెల్పఁగదె గా । యత్రీ దయాంభోనిధీ॥ ౨౨
శా॥ పృథ్వీ ! నిన్నొకసారియేఁ దలఁచుచో । నెన్నేని పాపంబులే
విధ్వంసంబగునంచుఁ బల్కుదురహో । పేమారు నిన్వేఁడుచో
నధ్వాన్నంబగు జన్మమేని సఫలం । బైయొప్పదే కాదె మో
క్షాధ్వంబెన్నఁ బెరంటి కల్పకము గా । యత్రీ దయాంభోనిధీ॥ ౨౩
మ॥ జగమున్ సృష్టియొనర్తు వీవయనుచున్ । సంవాదమున్ జేతురీ
జగమే నైజముగా జనించెననుచున్ । సంప్రీతి వాదింతురీ
జగడంబందున నేది నమ్మఁదగునో । సంధ్యా వచింపంగదే
అగచాట్లన్నియుఁ దీఱిపోవఁగను గా । యత్రీ దయాంభోనిధీ॥ ౨౪
శా॥ సర్వేశ ! మనువారమీవలన నే । జన్మించెనంచున్ సదా
సర్వామ్నాయములాడుచుండు సఫలా! । సత్యా! సుధీ! కావునన్

౧ తారుకాణము = దృష్టాంతము * వల్లి = బల్లి.

సర్వార్థప్రద యెట్లు జప్యములగున్ । సత్యంబుగా నన్నియున్
అర్వాచీనముగాన నీకరయ గా । యత్రీ దయాంభోనిధీ। ౭౫
మ॥ స్థిరమౌ బ్రహ్మను నాకు నీతఁడనుచున్ । జెప్పంగ నీవుండఁగాఁ
బరు నిం జెప్పుమటన్న నంతికమునన్ । వర్తిల్లుచుండన్ సుధా
వరభాండంబుఁ బరిత్యజించుచు సురా । భాండంబునుంగోరి న
ట్లరవిందానన యాచనుండఁగద గా। యత్రీదయాంభోనిధీ॥ ౭౬
శా॥ దర్పాంధుండను గొల్వ నేరను నినున్ । దర్పించి పాపంబు తా
సర్పంబట్టులు పొంచియున్నదిచుమీ । జాతీయ మే మోతలీ
కూర్పాసంబు త్వదీయనామముకదా । గోసుల్ వెసన్ దీర్పవే
యర్పింతున్ గొను నీకు నెమ్మనము గా।యత్రీదయాంభోనిధీ॥ ౭౭
మ॥ బలినీకర్పణ మేమిచేయవలెనో । భక్తప్రియా యెన్నఁడేన్
దెలియన్ జాలని మాటమొద్దునగుటన్ । నిర్లోభసంప్రీతితోఁ
దెలియంజెప్పెడివారు లేరగుటచే । దేవీ హృదబ్జంబినే
యలరర్పించెదఁ బ్రీతిఁగైకొనుము గా। యత్రీదయాంభోనిధీ॥ ౭౮
శా॥ విఖ్యాతంబు సమస్తవిప్రులకుఁ బా । విత్ర్యంబు నీమంత్రమౌ
ముఖ్యంబంచుఁ దలంపకెన్నఁడకటా । మూఢాత్ములై యేదియో
యాఖ్యానమ్మనుసమ్మి నెమ్మనములన్ । హాళింతు రెల్లప్పు స
ద్వ్యాఖ్యన్ జేయఁగ లేరునీయభిధ గా। యత్రీ దయాంభోనిధీ॥ ౭౯
మ॥ మునులా బ్రహ్మపదంబుఁ జేరుటకునై । మున్నేమిమంత్రంబుతో
నినుధ్యానించిరో నేనెఱుంగనుగదా । నిర్వాణ సంధాయినీ యా
ఘనమంత్రంబును నాకుఁదెల్పి యిఁకనీ । కారుణ్యమున్ జూపి న
న్ననఘున్ జేయవె నిన్ను నమ్మితిని గా । యత్రీదయాంభోనిధీ॥ ౮౦
శా॥ శాస్త్రీయంబుగఁ జాలకాలమును దా। శ్రద్ధాళుఁడై యెన్ని యో
శస్త్రాస్త్రంబులు నేర్చినన్ దపమునన్ । సద్వంశజుండైననున్
వస్త్రాద్యాభరణాది భూషితుఁడునై । నన్ దావకీనమ్మగు బ్ర
హ్మాస్త్రంబున్ నిరసింప వేఁడుగద గా । యత్రీ దయాంభోనిధీ॥ ౮౧
మ॥ పిడుగుల్ వ్రాలినయట్టి కష్టములె యా । వేశించి యున్నప్పు డె
న్నఁడు స్వప్నంబున నిన్నెఱుంగనతఁడున్ । సద్భక్తిధ్యానించుచోఁ

బిడుగుల్పుష్పములట్టులౌ ననుచు నే । విన్నానుగాఁబట్టి నీ
యడుగుల్గొల్చెద నన్నుఁగావఁగదె గా । యత్రీదయాంభోనిధీ॥ ౨౨

శా॥ తల్లీ నిన్ను మనంబునన్ దలఁచుచో । దాష్టంబు వాటిల్లునే
యన్వేషించున కాలుఁడాతనికినై । యాయాసమున్ గల్గునే
మనాపదల్ నినుఁగొల్చుచుంటనె కదా । మాన్యాత్ములై రాటఁ బిం
కాన్వీతుండను నిన్ను నమ్మితిని గా । యత్రీ దయాంభోనిధీ॥ ౨౩

మ॥ ఇల నాహార మనొక్కటైననుసరే । యొల్లప్పుడుండన్ దగున్
గులభేదంబులటంచుఁ దెల్పుటకునై । కోర్కెన్ విభేదంబు ప
క్షులలో వన్యమృగంబులన్ బసులలోఁ । గూడన్ బ్రకల్పించు నీ
యలఘు ప్రతిజ్ఞ నుతింతు నెమ్మదిని గా । యత్రీదయాంభోనిధీ॥ ౨౪

శా॥ కార్యంబుల్ సమకూరవే నినుమదిన్ । గాంక్షించి ధ్యానించుచోఁ
గార్యంబంతయుఁ బోవకున్న యరి । వర్గంబైనఁ జాకుండునే
వీర్యంబెంతయుఁ బుట్టదే మనమునన్ । వేర్పాటు వాటిల్లునే
యార్యా బాలుఁడ నిన్నుఁ జేరితిని గా । యత్రీదయాంభోనిధీ॥ ౨౫

మ॥ అమరో తండిరికంటెఁ దల్లిదయ యం । దాధిక్యతన్ జూపునం
చు మహాత్ముల్వలపోసిపోసి యనినున్ । ముమ్మాటికిన్నాత్రయీ
కమనీయాంబవటంచుఁ బల్కిరటులన్ । గానంబు గావించు న
న్నమలంబౌ దయఁజూపి కావఁదగు గా । యత్రీదయాంభోనిధీ॥ ౨౬

శా॥ సద్వంశమ్మునఁ బుట్టినన్ నిరతి ష । ట్ఛాస్త్రంబులన్ నేర్చినన్
విద్వాంసుఁడని పేరుగాంచి సభలన్ । విఖ్యాతినింబొందినన్
విద్వేషంబులుపోవునే తనకు హృ । ద్వీథిన్ నినున్ గానమిన్
అద్వైతంబు ఘటిల్లునే మదికి గా । యత్రీ దయాంభోనిధీ॥ ౨౭

మ॥ జనులందెచ్చును దగునున్నదనుచున్ । జాటించుకోసంబు కాం
చనకావ్యాది సులోహ జాతములలో । నగరాలలోఁగూడ నె
చ్చునుదగ్గన్ బ్రకటించునట్టిదగు నీ । చొక్కంపుఁ బ్రాభావమే
ననయంబున్ మదిలోఁ దలంచెదను గా । యత్రీదయాంభోనిధీ॥ ౨౮

శా॥ ఎవ్వాఁడెద్దరనిన్ను నెమ్మనములో । నెంచున్ సదా ప్రీతితో
నవ్వానిన్ గృపతోడఁ బ్రోతువని యా । యాయుష్యల్లుతులేస్తురో
అవ్వా బాలుఁడఁ బాపకర్ముఁడ నిను । న్నశ్రాంతమూహించునా

కపాన్ దయ చేయు మోక్షమును గా॥యత్రీదయాంభోనిధీ! ౮౯

మ॥ తులసీపత్రము నేసినంత నె రుచుల్ । తోయంబునన్ మాఱున
టులరుం బోడిరొ నీపదాంబుజములన్ । ధ్యానించు మాత్రాన భ
క్తుల తత్వంబును మాఱఁగావలయు సం । తోషప్రదాయింకనా
యలతత్వంబును మార్పవేమిటికి గా । యత్రీ దయాంభోనిధీ॥ ౯౦

శా॥ కష్టంబు ల్ననుదెంచుకాలమున నిన్ । గావించి ప్రార్థింప నా
గష్టంబుల్ వెసఁబాసియున్ సుఖము లక్కాలానఁ । బ్రాప్తింపవే
దుష్టాత్ముల్ హితులై కనంబడరె సం । తోషాబ్ధిలోఁ దేల్పవే
అష్టైశ్వర్యములీయవే యపుడ గా । యత్రీ దయాంభోనిధీ॥ ౯౧

శా॥ నీ మంత్రంబును బాడినన్ మనువుల । న్నింటికిన్ రతిన్ బాడిన
ట్లే మాన్యంబగు రూపుగొల్చిన వ్యాపీ । కేశాదులన్ గొల్చిన
ట్లే మాన్యాఖిల మంత్రదేవమయవై । యీవుండుటం జేసి నే
నా మంత్రంబును రూపముల్ దలతు గా॥ యత్రీదయాంభోనిధీ॥ ౯౨

మ॥ పరదేవార్చన భక్తిపూర్వకముగా । వాగీశ కావించినన్
స్థిరమై యయ్యది నిన్నుఁ జేరునయినన్ । నిక్కంబు యోచించు వో
సురవంద్యా విధికాదు కాదవిధియై । చూపట్టు నట్లాటచే
నరవిందానన నీకుకొల్వ విధి గా । యత్రీ దయాంభోనిధీ॥ ౯3

శా॥ ఏకాలంబున నీదు భక్తులకుఁ ద । ల్లీ యేది యావశ్యకం
బా కాలంబున కాపదార్థ పితతిన్ । హర్షంబుతో నిత్తువా
నీకల్యాణ గుణంబెఱుంగమి నదే । నిక్కంబయిమ్మంచు ని
న్నాకాంక్షించుట భక్తుఁడౌనతఁడు గా॥యత్రీదయాంభోనిధీ! ౯౪

మ॥ కమలాక్షుండును వహ్నినేత్రుఁడు మొద । ల్గాగల్గు దేవాళి వి
శ్వమయత్వంబునులేని వారగుటచే । సంధ్యా మహాదేవి వా
రి మహత్వంబును స్వల్పమాశ్రితుల యా । ర్తింబీర్చుటట్లాటఁగా
ల్త మరో విశ్వమయత్వమున్న నిను గా॥ యత్రీదయాంభోనిధీ॥ ౯౫

శా॥ దుర్వార్యంబగు కార్యముల్ సలుప నీ । తోడ్పాటునుంబొందువాఁ
డుర్వీ చక్రమునందు సార్థకుఁడుగా । నుండున్ గదా యెవ్వఁడున్
గర్వాంధుండయి నిన్నువీడి యెదియే । కావించునే పూర్తిగా
నర్వంబై యలరారునాక యది గా । యత్రీ దయాంభోనిధీ॥ ౯౬

మ॥ భ్రమరధ్యానముచేతఁ గీటముద్విరే । ఫంబైనచందాన నీ
యమలధ్యానముచేత భక్తుఁడును నీ । వై పోవుటబ్రింబె ధ్యా
నము చేయందగునట్టి మార్గమెదియో । నా కానతీయంగదే
అమరాధీశ్వర సన్నుతాంఘ్రియుగ గా । యత్రీదయాంభోనిధీ॥ ౯౭

శా॥ కర్తవ్యంబులవెవ్వియో యెఱుఁగ నిన్ । గాంక్షించి యర్పింప స్త్రీ
మూర్తిన్ జూపి త్వదీయ పుత్రునకు సం । పూర్ణంబుగా ప్రేముడిన్
గర్తవ్యంబు లెఱుంగఁజేయఁగదవే । కల్యాణమీయంగదే
ఆర్తత్రాణ పరాయణా శుభద గా । యత్రీదయాంభోనిధీ॥ ౯౮

మ॥ పరుసంబున్ వెసఁదాఁకినట్టి యినుమున్ । బంగారమైనట్లు నీ
చరణద్వంద్వముఁ దా । కినప్పుడుకదా! సద్భక్తుఁడీవౌట నీ
యిరవేదో తెలియంగఁ జాలనుజుమీ । యింకేదయన్ జూపి నీ
యరవిందాంఘ్రులుదాఁక నీయఁగదె గా । యత్రీదయాంభోనిధీ॥ ౯౯

శా॥ ఎగ్గుల్సేసితి బుద్ధిహీనతను నే । నిక్కాలపర్యంతమున్
నెగ్గింపందగు దేవినీవనుచు నే । నీ పాపునన్ గోరితిన్
నుగ్గాడంగదె పాపకాననములన్ । నూటాఱులన్ బ్రీతిని
న్నగ్గింపంగలనే బుధాళివలె గా । యత్రీదయాంభోనిధీ॥ ౧౦౦

మ॥ పువునుంబుట్టఁగఁజేసి మొట్టమొదటన్ । బూబోడి యాపైనఁగా
యవి నిర్మింతువుచుమ్మి చెట్టులకు నమ్మాతీ వెలంగొన్నిఁటన్
బువుకంటె న్నలపిందెఁ దొట్టతొలుతన్ । బుట్టించుచున్నావుగా
అవురా నీదగు ప్రజ్ఞనేమనుదు గా । యత్రీదయాంభోనిధీ॥ ౧౦౧

మ॥ జననీ పూవును గొన్నిఁటన్ దొలుతనే । జన్మింపఁగాఁజేతు పిం
దెను గొన్నింటనఁబుట్టఁజేతు తొలి గా । న్నింటన్ విచారింపఁగా
యనుమాత్రంబె సృజింతువా పువును ర । వ్వంతైన లేకుండ నే
మనివర్ణింతును నీదు ప్రాతిభను గా । యత్రీదయాంభోనిధీ॥ ౧౦౨

మ॥ జననీ ముందుగఁ గాయనేర్పరచి యా । సద్గర్భమందెన్నొ వి
త్తనముల్నిన్పియు సృష్టికెంతొ విపరీ । తంబట్లుగా జీడిగిం
జనొ యాపందున వెల్పటుంచితివి నీ । చాతుర్యమేమందునే
అనవద్యాత్మక చిత్రసృష్టిరత గా । యత్రీదయాంభోనిధీ॥ ౧౦౩

మ॥ శివుఁడే వెన్నునికంటె గొప్పయనుచున్ । జీవ్వల్ కడున్ జేయ మా

ధవుఁడే భర్గునికంటెఁ బెద్దయనుచున్ । ధర్మజ్ఞులీయందురా
శివనారాయణులట్లు భేదమెపుడున్ । జెప్పంగ వీల్కాదు సు
మ్మవనీమాత్రము గాన నీ గొలుతు గా। యత్రీదయాంభోనిధీ॥౧౦౪

మ॥ రమనీదైన సదాజ్ఞ చేతఁ గద సూ । ర్యాచంద్రులు న్వేలు ట
గ్ని మహాతీవ్రముతోడ మండుటయు వె। డిన్ వీచుట ల్వాయువున్
క్రమముం దప్పక యిట్టినీ మహిమ న। జ్ఞానంబునందుంటచే
నమరో సుంతయెఱుంగనయితిఁ గద గా। యత్రీదయాంభోనిధీ॥౧౦౫

శా॥ నీమంత్రంబు సమస్త శాత్రవులకున్ । దివ్యాస్త్రమై తోఁచెడిన్
నీమంత్రంబు సమస్త రోగములకున్ । దివ్యౌషధంబయ్యెడిన్
నీమంత్రంబిల మోక్షరాజ్యమునకున్ । నిశ్రేణికామైతగున్
ఆమంత్రంబును వీడఁగాఁదగునె గా। యత్రీ దయాంభోనిధీ॥ ౧౦౬

మ॥ శ్రుతులన్నింటిఁ బఠించిన న్సుమతియై । చోకారమూపా మహా
క్రతువుల్సేసిన భూరిదక్షిణలఁ దీ । ర్థవ్రాతము న్గ్రుంకిన న్
రతి వృద్ధాఫలమెంతో యంతయగునిన్ । భావింప నశ్లాటచే
నతులంబై తగునిన్నునేఁ దలఁతు గా। యత్రీదయాంభోనిధీ॥౧౦౭

శా॥ నీమంత్రంబు జపింపఁగాఁదగరు వా । ణీ, నారులంటారు కా
నీమంత్రంబు జపించు నారులకునే । నిర్వ్యాజమౌ ప్రేమతోన్
సామంతా పొడకట్టిపల్కెదగుటన్ । సామప్రియా చక్రిణీ
ఆమాటెట్టులు నమ్మఁగాదగును గా । యత్రీ దయాంభోనిధీ॥౧౦౮

శా॥ శ్రీవత్సాభిధగోత్రసంభవుఁడ నా । ర్వేలాడ రంగాఖ్యుఁడన్
ప్రావీణ్యంబు భవత్కృపారసమునన్ । గల్గంగ నప్పించితిన్
నావిలైనటు మాటయెన్నిదిఁటినిన్ । శార్దూల మత్తేభముల్
ఆవంతేనియుఁ గోపగింపకుము గా । యత్రీ దయాంభోనిధీ॥ ౧౦౯

శా॥ అనయము న్వస్వరూప పరి । శోధిత హృత్సరసీరుహంబున న్
మనము లయంబుజేసి ప్రణ । వంబు జపించు మహానుభావునిన్
ఘనయశుబ్రోవుమో జనని । గాధితనూజుని శిష్యనూనునిన్
యనిమిదిసంఖ్యనొప్పు కృతి । నాముని వెంకటసుబ్బయార్యుఁడన్।౧౧౦

సమాప్తము.

# ప్రకటన.

ఈ కవి విరచితమై విక్రయమునకు సిద్ధముగ నున్న గ్రంథములు -

౧ ఆంధ్ర చంపూ రామాయణము సంస్కృతమున భోజరాజు విరచితమైన చంపూరామాయణమునకు సరియైన యాంధ్రపద్య గద్య కావ్యము వెల రు. ౧—౦—౦

౨ ఆలిశాకలు ( వాగడాడు మంగలివాని గర్వభంగము ) ఇంగ్లీషు నుండి తెనిఁగింపఁబడినవి. వెల రు. ౦—౨—౦

3 శ్రీ గాయత్రీ భజనగీతామృతలహరి (గాయత్రి భజన కనుకూల మగు కీర్తనలు) వెల రు. ౦—౪—౦

వలయువారలిట్లు వ్రాయవలెను:—

పూసపాటి రంగనాయకామాత్యకవి
గుంటూరు జిల్లా
బాపట్ల తాలూకా
పూసపాడు.